ఆయుర్వేద దీపిక : ఇచట అర్థవంతములైనవి చెప్పబడినవి అనగా-శాస్త్ర, ఆచార్య, శిష్య పరీక్షాది రూపమును పేర్కొనుట వలన కలిగిన అర్థము. అర్థకాంతమనగా-సంబద్ధమైన అర్థమును కలిగియుండుట మొదలగువానిచే కమనీయమైన అర్థము కలుగును. అది చెప్పబడినది. శబ్దమును వాక్యమునందు సరిగా ఉపయోగించుట శబ్ద సంధి. దోషాదీనాం....అను వాక్యము ద్వారా విమాన స్థానమును సంగ్రహము చేయుచున్నాడు. సహేతుకముగా అనగా సకారణముగా ఎట్లు అగునో అట్లు దోషాదిమానములను సకారణముగా అని అర్థము. నిరుక్తాని అనగా నిరుక్తి చేసి చెప్పబడినవి. విమాన శబ్ద నిరుక్తి-దోషాదులు వేనివలన విశేషముగా తెలియబడునో అవి విమానములు.

ఇది శ్రీ చక్రపాణిచే రచింపబడిన ఆయుర్వేద దీపికయను చరక తాత్పర్య టీకయందలి విమాన స్థానమున రోగభిషగ్జితీయ విమానమను ఎనిమిదవ అధ్యాయము. ఇట్లు విమానస్థానము ముగిసినది.

ఇది పావులూరి హిమసాగర చంద్రమూర్తిచే చేయబడిన చరక విమాన స్థానమునందలి మూలము మరియు చక్రపాణి వ్యాఖ్యలకు తెలుగు అనువాదము.